అంకితం:

కని పెంచిన ప్రేమమూర్తి

మాతృ దేవికి

భక్తిపూర్వకంగా

# మానసప్రీతి

[గేయ నాటకం]

ప్రథమ ప్రచురణ

అక్టోబర్ 1953

కనకమేడల వెంకటేశ్వరరావు



[వెల 0-12-0]

# పరిచయం

'మనుస్మృతి' అంటే ఏదో ధర్మశాస్త్ర గ్రంథమని ఊహించ వచ్చును గాని, ఇది ఆధునికాలంలో రచించిన నేటి కావ్యం

హృదయానికీ మేధకూ జరిగే సంఘర్షణ, పరిష్కార సమన్వయము ఈ కావ్య లక్ష్యాలు. కావ్యాంతంలో 'శ్రద్ధ' ఇడకు చేసే ఉపదేశంలో సంక్షిప్తంగా ఈ కావ్య తాత్పర్యం గోచరిస్తున్నది.

"ఇచ్ఛా కర్మ జ్ఞానాల భిన్నత్వం
మానవ లోకాశాంతికి మూలం
వాని సామంజస్య మార్గం
శ్రద్ధా హృదయ విశ్వాసం
ఇదే మానవ జీవన రహస్యం–
ఇదే మహాజ్ఞానం–"

ఈ కావ్యంలో మనువు మానవ జాతికొక సంకేతం వంటి వాడు. అంతేగాని కేవలం, పురాణ ప్రసిద్ధుడైన మనువుగా ఇతణ్ణీ కావ్యంలో అవతరించాడని భావించ కూడదు. శ్రద్ధా మేధ లిద్దరూ అతని అంతర జగత్తులో బయలుదేరే భిన్న భిన్నాదర్శాలు, సంఘర్షణలు, రూపం ధరించిన మూర్తులు.

హృదయ, మేధా సంఘర్షణ మానవ వ్యక్తులలోనే కాక చరిత్రలో కూడా చిరకాలం నించీ అనుగతమై వస్తున్న ఒక విషమ సమస్య.

ఇదే సమస్య కావ్యవస్తువుగా స్వీకరించి; సుప్రసిద్ధ హిందీ కవి జయశంకర్ ప్రసాద్ "కామాయని" కావ్యం రచించారు. ఇది నేటికీ హిందీ వాఙ్మయంలో మహాకావ్యంగా పరిగణింప బడుతున్నది.

శ్రీ కనకమేడల వెంకటేశ్వరరావు గారు రచించిన ఈ కావ్యం ఆ రచనకు అనువాదం గాని, ఛాయానువాదం గాని కాదు. ఆ కావ్యములో కొన్ని ప్రధాన సిద్ధాంతాలు మాత్రమే స్వీకరించి స్వతంత్ర ధోరణిలో వీరీ కావ్యం వెలయించారు.

శ్రీ వెంకటేశ్వర రావుగారు హిందీ సాహిత్యం కూలంకషంగా అధ్యయనం చేశారు. స్వయంగా హిందీలో కావ్యాలు, కథలు, సాహిత్య విమర్శలు రచించి హిందీ పాఠకులకు సుపరిచితులైనారు. అటు ఆంగ్ల సాహిత్యంకూడా అభిమానంతో ఆకళించుకొన్నవారు. తెలుగులో కొత్త, కొత్త పోకడలు సృజించాలనే అభినివేశంతో ఈ కావ్య సృష్టి కుపక్రమించారు.

వీరింతకు పూర్వమే "సంఘుడు" అనే పద్య కావ్యం రచించారు. "పతిత్యాగం" అనే వీరి సాంఘిక రూపకం, సహృదయుల మన్ననలందుకొన్నది.

ఇంతేగాక వీరు కథకులుగా, విమర్శకులుగా, కవులుగా, నేటి ఆంధ్ర వారపత్రిక, ఆంధ్రప్రభ, స్వతంత్ర మొదలైన పత్రికా పాఠకులందరికీ సుపరిచితులు. అటు సంప్రదాయము, ఇటు నవ్యత, రెండూ నిశితంగా అవగాహన చేసుకుంటూ వాఙ్మయాభినివేశంతో నిత్యమూ పరిశ్రమించే యువ కవులు.

కవిత ప్రస్తుతం, మన దేశంలో ఎక్కువగా వ్యక్తి స్వీయ భావ సృష్టి రూపంలోనే అవతరిస్తున్నది. ప్రాచీన సంప్రదాయ ధోరణిలో పురాణ కవిత రచించేవారు, కథా ప్రధాన కావ్యాలు రచించేవారు, సుప్రసిద్ధులు చాలా మంది కనిపిస్తున్నారు.

అయితే ప్రస్తుతం మన భాషలో రూపక రూపంలో వచ్చే కవిత మాత్రం చాలా స్వల్పంగా కనిపిస్తున్నది. ప్రాచీన సనాతన పాశ్చాత్య కవులనేకులు, రూపకాల ద్వారా ప్రశస్తమైన కవిత్వం పలికించి, ఆయా వాఙ్మయాల్లో ఈ శాఖకొక ప్రత్యేక గౌరవం కల్పించారు. ఏట్స్, ఇలియట్, మొదలైన, ఆంగ్ల కవులనేకుల కవితారూపకాలా భాషలో అఖండ విఖ్యాతి గడించుకొన్నాయి.

అధునాతనులలో శ్రీ శివశంకర శాస్త్రి గారి మార్గంలో సుప్రసిద్ధమైన నాటకా లనేకం రచించి, నేటి కవిత్వానికొక నూతన ప్రస్థానం సృష్టించారు. వారి మార్గం అవలంబించి మరి కొందరీ ధోరణిలో కొన్ని రచనలు చేశారు గాని ఎందు చేతనో కవిత్వ రూపకాలింకా మన భాషలో విరివిగా బయలుదేరడం లేదు. బహుశః ఇకనుంచి క్రమ క్రమంగా మన కవిత ఈ రూపంలో వెలువడ గలదేమో!

కేవల కవితారూపకాలలో వచనం పానకంలో పుడకలా అడ్డువస్తుంది. రంగ సూచనలలో తప్ప దాని ప్రమేయం

పనికిరాదు. ఈ రూపనాలు వృత్తాలలోగాని, ఛందో బద్ధంగా గాని, స్వేచ్ఛా ఛందో మార్గంలో గాని రచించే సంప్రదాయం ఉన్నది.

శ్రీ వెంకటేశ్వరరావు గారి మనుస్మృతిలో చాలా వరకు నియమిత ఛందో మార్గమే అవలంబించారు. కొన్ని కొన్ని చోట్ల వీరి రచనలో స్వేచ్ఛా ఛందో స్ఫూర్తిని కూడా కనిపిస్తున్నది. ఇది ఆయా ఘట్టాలలో పాత్రల మనః ప్రవృత్తికి అనుకూలమైన మార్గంలో సమస్త రూపక రచనా వైవిధ్యానికి చక్కని సోపానం కల్పిస్తున్నది.

ఈ క్రింది ఉదాహరణలు వీరి భావనా శక్తికి, సద్ప్రయోగ నైపుణికి, లలిత గేయకీర్తికి పాత్రల మనః ప్రవృత్తి చిత్రణానికి చక్కని తార్కాణాలు.

మనువు: ఈ కల్పనామయ జగ
త్ప్రాంతతటి మధుర సుందరమ్ము.
సుఖ స్వప్న సుషుప్తావస్థలో
మేలు కొలుపు ఎంతటి పులకితములు.
హృదయ సంవేదనల సంఘర్షణ లేక యున్న
కలిమి లేముల గూర్చి చింతించువారెవరు
విఫల జీవితగాథ వినిపింతు రెవరు

(పేజి 11, పంక్తి 19.)

మధుర జాగరణమ్మునోతె ఇదెంతటి ప్రియతమమ్ము
మందస్మితమ్మునోతె ఎంతటి చంచలమ్ము
సుందర రాగాలాపనము నోతె
ఎంతటి తరంగ మిశ్రితము
జీవితాశ మెల్లగ చల్లగ రేగుచున్నది
ఈ శుభోదయ సంతోషమ్ము
నెవరి పాపాల నర్పింతు
శక్తి మంతుడ నంచు
నాలోన నెవ్వహది పోయెదగ
ఈ దిగంతాల శాశ్వతత్వమ్ము
నా ప్రియ గర్జనమ్ము.

(పేజి 10, పంక్తి 20).

శ్రీ వెంకటేశ్వరరావుగారిలో చక్కని కవితా శక్తి స్ఫురిస్తున్నది. వీరిలో కవికి కావలసిన వివిధ సాహిత్య పరిశీలనము, నిశితమైన విమర్శక శక్తి ప్రస్ఫుటంగా [illegible]

అచిరకాలంలో వీరు ఆంధ్ర భాషలో చక్కని కవితా రూపకాలు రచించగలరనీ, నాటక రంగంలో తిరిగీ కవిత అవతరించేటట్లు ప్రయత్నించి కృత కృత్యులు కాగలరనీ, క్రమంగా యువకవులలో ప్రముఖులు కాగలరనీ ఆశిస్తున్నాను.

చెన్నపురము
౨౦-౧౦-౫౩

పి. గణపతిశాస్త్రి

# స్మృతి

అతి ప్రాచీనమైన జలప్రళయంలో దేవతా జాతిసమస్తం నాశనం కాగా మనువు మాత్రం ఒకనావ సహాయంవల్ల బ్రతికిఉంటాడు. సముద్ర సంబంధమైన ఒక పెద్దచేప కొట్టినదెబ్బవల్ల ఆనావ హిమాలయ శిఖరాగ్రం చేరుకుంటుంది. ఆ ఉత్తుంగ శిఖరం పై కూర్చొని మనువు జరిగిన విషయాలనుగురించి ఆలోచించు కుంటూ ఉంటాడు. అతనిహృదయం ఆందోళనలతో నిండిఉంది.

మనువు : " ఓ చింతా ప్రథమ తరంగమా!

దివ్య విశ్వ వన వ్యాళిమా!

ప్రళయాగ్ని పర్వత ప్రథమ కంపమా!

అభావ చపల పుత్రికవు, అశుభసూచికవు

కర్తవ్యబోధివి, మాయాజగత్తరంగమవు

సకలలోక పరివ్యాప్తవు

తరల గరళ లఘుబిందువవు.

అమరలోక జరావస్థవు, జన్మాంధవు

వ్యాధి సూత్రధారిణివి

మనోవ్యథవు మధుమయ శాపమవు

హృదయాకాశ ధూమకేతువవు

పుణ్యసృష్టికి సుందరశాపమవు

హృదంతర నిగూఢ వర్తనవు

సుక్షేత్రో పరివ్యాప్త మేఘమాలవు

పోమ్మా నీవు నా హృదయాంత రంగమ్ము నుండి
స్వాగతమ్ము విస్మృతికి, మనశ్శిథిలత కాహ్వానమ్ము
శాంతికావలయు, మనశ్శాంతి, జాగ్రదవస్థవలదు
అచేతనత్వమా ! నాహృదయాన శూన్యమ్మునింపు
పునరావృత్తి భయంకరమ్ము. వేదనాభరమ్ము
ఏదీ నాటి వైభవమ్ము, విలాసమ్ము
సురబాలల సౌందర్యమ్ము శృంగారమ్ము
ఏదీ ఆయౌవన స్మిత మధుపసదృశ
నిశ్చింత విహారమ్ము, మదమత్త వ్యవహారమ్ము
ప్రకృతి దుర్జ్ఞేయమ్ము
ఓ దేవజాతీ, ప్రథమసృష్టీ
అజేయులమని ఎంచిన పరాజితులం, అవమానితులం
మన సంస్కృతి సోపానములు
యజ్ఞయాగాదు లెక్కడ, పశుబలి యెక్కడ
సురాపాన మేదీ, వలపు గొలుపు బాల లేరీ
ఏమైనది ఆ జీవనం
సమస్తం సర్వ నాశనం
గర్వం – అభిమానం ఉపేక్షా భావం – సర్వం
ఏమైనవి కనిపించవు
పంచ భూతములు ప్రకోపించినవి
ప్రళయాగ్ని ప్రభవిల్లినది
జలప్రళయం ఉద్భవించినది

అనంత దేవ జాతిలో అల్పుడ నొక్కడ మిగిలితి
ఈ జగన్నాటక ప్రథమాంక పుటఘను పాత్రధారిని-
ఇనసూర్యానిమేయజగమ్ము విషాదమయమ్ము
అమరనామకుల అధోగతి యిది
శ్మశానమ్ము, నాశము, విధ్వంసము
అంధకార మభావము సత్యమ్ము
అమరులము కాము మనము
మర్త్యులము, అశాశ్వతులము
మృత్యుదేవా! చిరనిద్రవీవు
హిమశీతల సదృశవు
కాల జలధిలో నారాటపు టలల నింపుదువు
ప్రళయనర్తకుని ప్రథమ పాదమువు
అఖిల శక్తుల కంత కారిణివి
అభిశాపమవు జగత్తుకు,
పునఃసృష్టికి మూలహేతువవు
అంధకారములోని అట్టహాసము భాంతి
ప్రతిధ్వనింతు వగుపింపవు
ఈ సృష్టి కణకణమ్ముల దాగితివి
ఇది నిత్యసత్యరహస్యమ్ము
జీవితము నీలో క్షుద్రభాగమ్ము
నీలమేఘమాలలో క్షణమాత్రపు మెరపు తీగలా
సౌందర్య మయమ్ము, కాంతిభాసితము"

మనువు ఆలోచనాతరంగాల్లో మునిగి తేలుతుండగా సూర్యోదయమవుతుంది. ప్రకృతిస్వరూపం మారుతుంది ఎండకాస్తుంది. మంచు కరుగుతుంది. సముద్రం వెనక్కి మరలుతుంది. భూమి, లతా వృక్షాదులు కనిపిస్తాయి. చల్లనిగాలి మెల్లగావీస్తుంటుంది. ఇవన్నీ మనువు మనస్సులో ఆశాబీజాల్ని మొలకెత్తిస్తాయి. మనువు జీవితాన్ని గురించి ఆలోచించడం సాగిస్తాడు.

మనువు : " సూర్యచంద్రులు వరుణ వాయువులు
ఎవరి కోసం అనుగమించడం
ఎవరిక్రోధం ఈ ప్రళయానికి కారణం
ఈ ప్రకృతి సమస్తం ఎంతటి దుర్బలం
పంచ భూతాలు ప్రకంపితాలు
దేవతలం మనంకాం, మీరెవరూ కాదు .
సమస్తం పరివర్తన శీలం
మన మండలం రథ బంధిత సగర్వతురంగాలం,
ఒక అనంత మహాశక్తికి ఆకర్షిత తరంగాలం
నా సుఖాశల హృదయాంతరంగాన
అస్థిరమైన సంపు మధుర స్వప్నమిదేమి ?
సుఖ ప్రదమ్మగు ఆశ
వ్యాకుల రూపమ్ము ధరించినదేమి !
మధుర జాగరణమ్ము వోలె ఇదెంతటి ప్రమత్తమమ్ము
సుందర స్మితమ్ము వోలె ఎంతటి చంచలమ్ము
సుందర రాగాలాపనము వోలె
ఎంతటి తరంగమిశ్రితము

జీవితాశ మెల్లగ చల్లగ రేగుచున్నది
ఈ శుభోదయ సంతోషమ్ము
నెవరి పాదాల నర్పింతు
శక్తి మంతుడ నంచు
నాలోన నెవ్వరూని పోయెదరు
ఈ దిగంతాల శాశ్వతత్వమ్ము
నా ప్రియ గర్జనమ్ము.
నా జీవిత విశ్వాసమ్ము నెవరు వినిపించువారు
జీవితాశ యేలనో ఇంతటి విలాస మయమ్ము
బ్రతకనా నేను ? బ్రతికి ఏమొనరించను
ఈ అమర వేదనతోటి
మరణ వేదన యెప్పుడో "

మనువు దృష్టిని నలువైపులా సారిస్తాడు, పైన శూన్య నీలాకాశం, క్రింద సస్యశ్యామలమైన భూమి కనిపిస్తాయి. శూన్యం లోని వైరాగ్యాన్ని తిరస్కరించి ఆనందం వైపుకు మొగ్గుతాడు మనువు. నివాస యోగ్యమైన గుహ నేర్పరచుకుని పూజా కర్మాదులు చేస్తూ జీవితం గడుపుతాడు. కాని ఏదో లోపం అతన్ని వెంటాడుతూ బాధ పెడుతోంది.

మనువు : " ఈ కల్పనా మయ జగ
మ్మెంతటి మధుర సుందరమ్ము
సుఖ స్వప్న సుషుప్తావస్థలో
మేలుకొలుపు లెంతటి పులకితములు

హృదయ సంవేదనల సంఘర్షణ తేలయున్న
కలిమి లేముల కూర్చి చింతింతు రెవరు
విఫల జీవిత గాథ వినిపింతు రెవరు
ఎవరికి విన్నవింప నీ గాథ
వ్యర్థంగా హృదయ రహస్యం
వ్యక్తీకరింప వలదందువా ?
ఓ కాంతి కిరణ రంజిత నక్షత్రమా!—
నీవే అంధకారపు సుందర రహస్యానివి
ఈ వ్యథిత బాధామయ విశ్వానికి
నవరస భరిత శీతల పందువు నీవు
ఆతప తాపిత జీవనానికి
సుఖ శాంతిమయ శైత్య ప్రదాతవు
ఓ అనంత రాశీ !
ఏమీ నీ మధుమయ సందేశం ?
ఓ శాంతిమయ నిశా !
నిస్తబ్దత నీ చాతుర్యం
ఇంద్రజాల జననీ ! రజనీ !
నీ దర్శనం అతి మధురం
తారామయ సంధ్యాకాంత
సుకోమల వస్త్రమ్ము దాల్చి
సింధు తటమ్మునకు రాగా ఆమె చీరను చించి
నవ్వెద వేల రజనీ ! ఏమీ దారుణమ్ము.

సంధ్యా కాంత
ప్రకృతి దురాచారాల
రక్షింపబోవ చూసి నవ్వెద వేల రజనీ !
ఎంకోటి విపరీతమ్ము.
విశ్వ పుష్పానికి
సుందర మధుకరి రజనీ !
ఎటు నుండి ఏతెంచి
ముద్దిడి నోహా ముద్రలో ముంచి పోయెదవు ?
ఓ రజనీ ! నీ అతులానంత
విభవమ్ములో ఇంత విరాగ మేల
గత జీవితాఘాతాల మరచి
యోచించు చుంటివా
నేనును విస్మరించితి
నా గత జీవిత గాధ
మమత, ప్రేమ, వేదన, భ్రాంతి
మనస్సు కేది సుఖ ప్రదం ?
అది లభించిన వదలకుమో రజనీ !
సర్వదేశ సంచారిణీ !
నీ భాగం నీకిత్తును
కృతజ్ఞతా సూచకంగా ”

——(:)——

హృదయ సంవేదనల సంఘర్షణ లేకయున్న
కలిమి లేముల గూర్చి చింతింతు రెవరు
విఫల జీవిత గాధ వినిపింతు రెవరు
ఎవరికి విన్నవించ నీ గాథ
వ్యర్థంగా హృదయ రహస్యం
వ్యక్తీకరింప వలదందువా ?
ఓ కాంతి కిరణ రంజిత నక్షత్రమా!—
నీవే అంధకారపు సుందర రహస్యానివి
ఈ వ్యథిత బాధామయ విశ్వానికి
నవరస భరిత శీతల బిందువవు నీవు
ఆతప తాపిత జీవనానికి
సుఖ శాంతిమయ శైత్య ప్రదాతవు
ఓ అనంత రాశీ !
ఏమో నీ మధుమయ సందేశం ?
ఓ శాంతిమయ నిశా !
నిస్తబ్దత నీ చాతుర్యం
ఇంద్రజాల జననీ ! రజనీ !
నీ దర్శనం అతి మధురం
తారామయ సంధ్యాకాంత
సుకోమల వస్త్రమ్ము తాల్చి
సింధు తటమ్మునకు రాగా ఆమె చీరను చించి
నవ్వెద వేల రజనీ ! ఏమా దారుణమ్ము.

సంధ్యా కాంత
ప్రకృతి దురాచారాల
రచింపబోవ చూసి నవ్వెద వేల రజనీ!
ఎంతటి విపరీతమ్ము.
విశ్వ పుష్పానికి
సుందర మధుకరీ రజనీ!
ఎటు నుండి ఏతెంచి
ముద్దిడి మోహా ముద్రలో ముంచి పోయెదవు?
ఓ రజనీ! నీ అతులానంత
విభవమ్ములో ఇంత విరాగ మేల
గత జీవితాఘాతాల మరచి
యోచించు చుంటివా
నేనును విస్మరించితి
నా గత జీవిత గాధ
మమత, ప్రేమ, వేదన, భ్రాంతి
మనస్సు కేది సుఖ ప్రదం?
అది లభించిన వదలకుమో రజనీ!
సర్వదేశ సంచారిణీ!
నీ భాగం నీకిత్తును
కృతజ్ఞతా సూచకంగా"

—(:)—

# శ్రద్ధ

మనువు ఎంత ఆలోచించినా ఏమీ తట్టడం లేదు. ఆశా నిరాశల మధ్య ఊగులాడుతున్నాడతను. అలాగే రోజులు గడచి పోతున్నాయి. రోజూ మాదిరి మనువు ఒక రోజున చింతా మగ్నుడై ఉండగా ఒక సన్నని స్త్రీ కంఠం వినిపిస్తుంది. మనువు ఆశ్చర్యంలో మునిగిపోగా ఒక విలక్షణ సౌందర్య సంపన్నురాలైన బాలిక అతని ముందు నిలబడి ఉంటుంది. ఆమె గాంధార దేశపు బాలిక శ్రద్ధ.

శ్రద్ధ: "ఈ సంసృతి సముద్ర తీరాన
తరంగాలు విసరిన మణి వెఃర వీవు
ఈ నిర్జన ప్రశాంత ప్రదేశమును
నీ కాంతి పుంజాన వెలిగించు చున్నాడవు"?

మనువు: "ఈ భూమ్యాకాశాల మధ్య ఉల్కా-మాత్రుడను
అసహాయుడ, నిరుపాయుడ
జీవిత భ్రాంతుడ నేను
నీరమ్ము లేని నిర్ఝరిణిని
సముద్రాంకమ్ము లేని ఆశ్రయ హీనుడ
సమస్యాయుత జీవితమ్ము నాది
సమర్థింప నసమర్థుడ
ఎవరినని చెప్పను
లక్ష్య హీనుడ శూన్యుడ
విస్మృతి చిహ్న మాత్రుడ నేను—

నా రాలి పోయిన జీవితానికి
వసంతమాత వెవర వీవు
గాఢాంధ కారాన
చంచల కిరణమ వెవరవు"?

శ్రద్ధ: "గంధర్వ దేశ రాజపుత్రికను
ప్రకృతి సౌందర్య పిపాసనై
యాత్రార్థమై వచ్చి కాంచితి
ఘోర జలప్రళయమ్ము నీ దేశాన—
ఓ క్లాంత దుఃఖాక్రాంత తపస్వీ
ఈ ఉద్వేగ వేగ మేల
జీవితాశ లేదా నీకు
త్యాగ వంచితుడవా నీవు
దుఃఖోద్వేగాన
అజ్ఞాత సమస్యల సృష్టించు కొన్నావు
భవిష్య జ్ఞాన శూన్యుడనై
కర్తవ్య విమూఢుడ వైతివి—
వినాశమ్ము ఆనంద హేతువు
విశ్వోన్నిల నానురక్తుడవు కమ్ము
సదిచ్ఛల పరిణామమ్ము
కర్మమయ సౌందర్యమ్ము – శ్రేయము.
నిరసింపకు దాని విరసింపకు

దుఃఖ రాత్రి వెనువెంటనె
సుఖ ప్రభాతమ్మగు,
సుఖరత్నాల కప్పిఉంచిన
విశాలాంబరము దుఃఖము.
అది అభిశాపమ్ము కాదు
జగజ్జ్వాలల మాలమ్ము
అది రహస్యవరమ్ము మరువకుము దాని.

ఈ స్పందిత మహా విశ్వము
విషమ పీడా వ్యస్తము
ఇదే సుఖదుఃఖ వికాస సత్యము
ఇదే మధుమయ దానము.

నిత్య సమరసాధికారమ్ము
జలధి లాగున ఉప్పొంగు
ఈ వ్యథాకులిత నీల తరంగాల మధ్య
సుఖమణిగణమ్ము ప్రకాశించు."

మనువు: "ఈ మధుర మారుతోచ్ఛ్వాసములు
ఉత్సాహ తరంగముల నింపు మనమున
కాని జీవితమ్ము ఉపాయ శూన్యమ్ము
నిరాశాకరమ్ము—దాని ఫలము
సఫల కల్పనా గృహమ్ములు నుమ్ము."

శ్రద్ధ: " ఇంత భీరుడవా నీవు
ఓడితివా జీవిత సంగ్రామాన
మరణించి గెల్తురు వీరులు
జీవన సత్యమ్ము తపము కాదు
ఈ దీన కరుణామయ విచారమ్ము క్షణికము.
ఆశానందము ఆకాంక్షాభరితము
వాడిపోయిన పూలు ప్రకృతికాంత
యౌవన శృంగార మొనర్పవు
ఘూళి కలియు నుత్సుకము లవ్వి—
జర్జరత్వమ్ము సహించదు ప్రకృతి
నిత్య నూతనానందము కావలయు
జగతి పరివర్తనాకాంక్షి వికాసశీల—
ఈ గంభీర సృష్టి పదచిహ్నల గాంచి
అనుసరింతురు రండు కనుము.
విస్తృత భూమండలమ్ము
ప్రకృతి వైభవ భరమ్ము
కర్మ ఫలానుభోగమ్ము, భోగార్థము కర్మకృతి
ఇదే జడచేత నానందము
ఏకైక వ్యక్తి వెటుల సాధింతువు
దురాలోచనల నెటుల పీడుదువు
జీవిత భారమున కృంగుచుంటివి
ఆధారమ్ముకై అన్వేషింపవు

దేవజాతి సమస్తం
నా అనుశీలనాన
అనుదినం పరిభ్రమించింది.
కను పరి క్రమించిన
నను పూజించిరి, అభ్యర్థించిరి.
ఆత్మాకర్షణ విలాససృష్టికి మూలమైనది
కామదేవుడను దేవజాతి సహచరుడను
వారి వినోద సాధనమును
నవ్వితి నవ్వించితి, జీవిత గతి చూపించితి
అతి అనాది వాంఛయె రతి
అది ఆత్మాకర్షణీయం
ప్రకృతి వికాసాంతరంగో
అనంత వాంఛ అది
మా యిరువురి అస్తిత్వం
ఆరంభ జీవితావర్తనం
ప్రపంచ రూపవర్తనం.
ప్రకృతి లత పుష్పవతి యైన
మధుహాసం మురిపించును
మధుర రూపద్వయం మురిపించును

---

జడత్వం వదిలింది, వికాసం ప్రబలింది
తత్ సుందరానురాగం
పరిమాణు బాల్లల పరువెత్తించింది

విద్యుత్కణ ప్రహారం
ప్రకాశానికి హేతువు
అణు మైత్రీ సంయోగం
మదమోహక సృష్టికి మూలం -
ప్రళయ విశ్లేషణం నవ్య సృష్టికి సంశ్లేషం—
ఎటుచూచిన ప్రియద్వయం
ప్రకృతి సమస్తం ప్రేమ కలాపం
మా యిరువురి ప్రణయ విహారం——
ఆకాంక్షా తృప్తి సమన్వయంలో
నిత్య వాంఛితుల మైత్రిమి
సంతత యౌవనానురాగంలో
రతి కాముల మైత్రిమి
సుర బాలల సఖి రతి
వారి హృద్వీణా తంత్రి
వారి మధుయానురాగ భర మనస్సుకు సాక్షి.
నేను తృష్ణను రేపుదు
రతి తృప్తిని చూపించును
ఆనంద సమన్వయం
మా జీవిత లక్ష్యం
నేడ ఏ ర జాతి నశించింది
వినోదం లేదు, వికాసం ఉంది
అనంగ మూర్తిని, అస్తిత్వం లేదు—

ఈ విశ్వం రంగ స్థలం
ఈ గృహం పవిత్ర కర్మస్థలం
పరంపరానుగతం జాతి సమస్తం
కొందరు కేవలం సాధనాలు, కొందరు సాధకులు
అదే ఈజాతి విశిష్టత్వం
కర్మ దాని పరమ లక్ష్యం
ఆరంభకుడ నేను, ప్రగతి కారకుడను
మానవ శీతలచ్ఛాయలో
నిజ కర్మ ఫలం శోధించెద
వాంఛా సంయమాల సముచిత సమన్వయం
వికాసానికి మార్గం
అతికి ఫలితం మహానాశం
ఈ జగద్వికాసానికి మూలశక్తి ప్రేమ
తత్సందేశ ప్రకటనార్థం
అరుదెంచినదీ బాల
మా యువపురి సంతానం—
అమల భవ్యరూపిణి
జడ చేతనాల అనుబంధం
జీవితోష్ణ సమస్యలకు శైత్యకారిణి, శాంతి మయి
పొంద గోరిన అందుకు యోగ్యుడవు కమ్ము"

—:—

# ప్రేమ

మనువు శ్రద్ధ కలిసే ఉంటున్నారు. కాని హృదయగత విషయాల నొకరి కొకరు చెప్పుకోవడం లేదు. దగ్గరగా ఉంటున్నా దూరంగా ఉన్నట్టే భావించు కుంటున్నారు. ఒకరి కొకరు తెలిసినా పరిచయం లేని వారలా సంచరిస్తున్నారు. ప్రపంచంలో ఉన్న వస్తువులన్నీ తనొక్కడివే ఐనా మనువు ఎందుకో విచారంగా ఉంటున్నాడు. ఒక సాయంకాలం మనువు శ్రద్ధను సమీపిస్తాడు ఆలోచనా మగ్న హృదయంతో—

మనువు : " ఓ అతిథీ! నీ సాన్నిధ్యంలో
సుందర భవిష్యత్తు సూహిస్తున్నా
ఎందుకీ వైయధ్యం ?
ఆకర్షించి తిరిగి దూరమై పోయెదవేల ?
ఎరుగ లేనా నిన్ను, కొసగదా నీ గుండె ?
పొంగి పొరలును ప్రేమ ప్రవాహం
జీవితాశ సమకూర్చలేవా ?
నా హృదయ శిథిల మందిరాన
ప్రేమ జ్యోతి వెలిగింపనా ?
ఈ జీర్ణ విశీర్ణ మందిరాన
ఎందుకో ఈ మాయ నిద్ర
వాంఛామయ మధురస్వప్నము
హృదయము సుఖ సౌందర్య ప్రతిమా !

కామ కిరణాలు ప్రసరించుచున్నావు
నా చిరలక్ష్యానివా—ఎవర వీవు
నీ మధుర స్మిత వాయు తరంగాల
నా హృదయ కవాటమ్ము తెరువ లేవా ?"

శ్రద్ధ: "ఇది నిజమా ! ఎరుగ నైతి నేను
అటులైన పోదము రమ్ము
మేఘ మాల పయనించు
చంద్ర బింబమ్ము పిలచు చున్నది మనల
ఆ చంద్రుని చిరు నవ్వులలో
కాల్పనిక దుఃఖాల మరచి పోదము రమ్ము
ఈ సుధామయ కౌముదిలో
ప్రకృతిస్వప్న శాసనసాధనారాజ్య మవలోకింతము రమ్ము

మనువు ; " ఎన్న సామలో కాంచితి నిన్ను
ఇంత సౌందర్యమ్ము కన లేదు
నా అతీత మధుర స్మృతులు
భావనా గీతికల నాలపించు
మై మరచు చుంటి –
నేను నీవాడనను భావమ్ము
నా హృదయాంప సుషులు రేగు –
ధమనుల వేదనా రక్తము సంచరించు
హృదయాంప భార తరంగాలు లేచు –
వాసనా జ్వాలల నానందమ్ము రేగు

దీపస్థ శలభము భ్రాంతి మందు చుంటి
ఉత్సాహ జీవనమ్ము కలదు—వేడి లేదు.
ఇంద్ర జాలమ్ము నేర్చితివా
ప్రాణ రహస్యమ్ము నెరిగితివా
విచార వినాశమ్ము చేయు చుంటి వెవర వీవు ?

శ్రద్ధ: ‹ ఎరిగితి నీ మనక్లేశమ్ము
కాంచితి దుఃఖ దగ్ధ వదనమ్ము
వింటి విచారమగ్న వచనములు
చాలించు మింక చాలు చాలు
కాంచుమీ ప్రకృతి సౌందర్యమ్ము
ఈ నీరవ నిశాకపుని కాంచు—

మనువు: " నిద్ర ఆవహించు చున్నది
స్వప్నములు రేగు మనమ్మున—
పురుష జీవిత లక్ష్యమ్ము
ఈ కోమల సుందర శరీరమ్మొ,
ఎరుగలేక తిరిగితి
నంధ బాలకుని భ్రాంతి
నేడు తెలిసెను హృదయ పరిణామ మెరిగితి
నీవు లేనిదె కర్తవ్యమ్ము లేదు – జీవిత ఫలమ్ములేదు
నా సర్వ శక్తుల నిదిగో కొనుము
సుందర నారీ విశ్వ రాణీ "

శ్రద్ధ : "చిరమిత్రుడా! నా యీ సమర్పణమ్ము
నారీ జాతికి చిర బంధనమ్ము కాకుండునా ?
దుర్బలను నేను, నీ స్నేహ భారమ్ము మోయ గలనా?
ఆనంద జలధి విహరింపగలనా ?

వెన్నెలలో మనువుతో మాట్లాడుతూ శ్రద్ధ ఆనందాన్ననుభవించింది. ఇక తనకోసం ఆరాట పడుతున్న మనువుకు ఆత్మ సమర్పణ చెయ్యాలని అనుకుంది. కాని చెయ్య లేక పోతుంది ఇది ఆమె కొక సమస్యలా తయారైంది. దాన్ని గురించే నిత్యం ఆలోచిస్తుందామె.

శ్రద్ధ : " మధుర స్వప్న విస్మృతావస్థలో
చెలరేగిన ఉన్మాద మనమ్ములో
ఆ మైమరపులో పెదవుల ధరించిన వ్రేలితో
కనులలో ప్రభవించిన
వసంత కుతూహల జలమ్ములో
ఈ నీరవ నిశీధి నే తెంతు వెవరవు
ఆకర్షక కోమల కర ద్వయమ్ము చాచి—
సౌభాగ్య పరాగ కణ భరమ్మా
ఏ యింద్ర జాల పుష్పాల కొని.
మధు ధారామయ మాలల
గ్రుచ్చు చుంటివి నీవు—
పులకాంకిత కదంబ మాల పోలె.
భావ పుష్పాల కూర్చితివి హృదయాన

ఫల భారమ్మున నా మనశ్శాఖ వంగి వ్రేలాడు చున్నది
నీలి కిరణాల సౌరభ యుత
మృదులాంచలమ్ము వరదానమ్ము మాకు
కోమలాంగిరు నేను శిరీష బాలను,
పరిహాస గీతాలు విన సంకోచ మొదవె
అట్ట హాసమ్ము మందహాస మగుచుండె
కన్నుల వక్ర భావ మేర్పడును—
ప్రత్యక్షానుభవమ్ము సైతము స్వప్నాలు లాగు తోచు
నా స్వప్న మాధుర్య కలవరమ్ము
ఆనంద డోలికల నూగి
అనురాగ సమీరాల సంచరించు
హృదయ గతాభిలాష సుఖస్వాగతమ్ము చేయు
జీవితాంత బల వైభవమ్ము ఆ దూరాగతుని సత్కరించు
రస నిర్ఝరిణిని చొచ్చి ఆనంద సింధువు చేరగల
నా అవలంబనమ్ము నాక్రమించితివి
స్పృశింప సందేహమ్ము చూడబోవ పక్ష్మపాతమగు
పరిహాస వాక్కులు పెదవుల నాగు
రోమాళి స్థిరముగ నిలబడి
నా హృదయమును వ్యతిరేకించు—
ఎవరవు నీవు హృదయ పరవశత్వమా!
సర్వ స్వతంత్రమ్ము హరించి నావు
స్వచ్ఛంద హృదయ కుసుమాల లాగు కొన్నావు

లజ్జ : ఆశ్చర్యపడకు బాలా!

మనస్సును వదిల పరచు కొమ్మ

ఆలోచనల కల్పించు అవరోధమును నేను

యౌవనావస్థలో

విద్యుత్ ప్రాణమయ ధారప్రవహించు

ఉన్మాదమ్ము కలుగు—

శుభ కుంకుమ శోభ, ఉషో లాలిత్యము

సౌభాగ్యమ్ము సౌందర్యమ్ము

ప్రసన్నత నిండిపోవు-

నయనానంద కరమ్ము, కల్యాణ దాయి

వసంత వన వైభవమ్ములో

పిక పంచమ స్వరమ్ము

నరసరముల నడచి పోవు.

రమణీయత్వ మగుపించు

భావికా కర్షణమ్ము

అంతస్స గూఢ ప్రేమాను రాగమ్ము

వసంతర్తు సౌందర్యమ్ము, సంధ్యాను రాగమ్ము

ప్రాతః సమయ జాగృతి

మధ్యాహ్న తీక్షణమ్ము కలసిందు—

ప్రేమికుల మనోభావ తరంగాల

ప్రతిఫలించును ప్రతిధ్వనించు.

స్వాగత మొసంగు పుష్పములు

మకరందమ్ము సమకూర్చు-
కోమల కిసలయ రవమ్ము జయ ఘోష దానికి
సుఖ దుఃఖ సమ్మిశ్రణమ్ము
ఆనందోత్సవ కరమ్ము
సుందర వరదానమ్మిది
అనంతాభిలాషల కాకరమ్ము
నేను దాని సంరక్షకు రాలిని
గౌరవ మహిమల నేప్పుడు
తెగల నున్న దెబ్బ సాలిసు చెప్పెద నేను
దేవజాతిని రతి నా పేని
కామదేవుని కోల్పోతి
నిషిద్ధ దీన మూర్తినై
అతృప్తనై తిరుగు చుంటి-
గత జీవిత మధుర సుందర
అనుభవమ్మవశిష్టమాయె
తీవ్రత్వము సన్నగిల్లినది, అలసట పైకొన్నది.
రతి ప్రతికృతిని లజ్జను
వినమ్ర బోధ చేతు
నర్తకి పాద ద్వయమున నూపుర ధ్వనిని నేను.
కపోలాల అరుణిమను, కను బొమ్మల కాటుకను
కిశోర చంచల సౌందర్య రక్షకు రాలిని
సౌందర్య దాత్రిని, బాధా కారిణిని-"

శ్రద్ధ: చాలిక చెప్పగలవా నా జీవిత పథం-
ఈ నిబిడ నిశీదాంధ కారంలో
ఆలోక మయ కిరణం ఏదో-
తెలిసి కొంటిని నేడు
సుకోమల సౌందర్య రాశిని, పరాజితను
నారిని దుర్బలను-
ఏల మనమింత అధైర్యము చెందు
కనుల నిండుగ నీరు క్రమ్మునేల
విశ్వాస మహా తరు చ్ఛాయలో
సర్వస్వ సమర్పణ వాంఛ
మోహా మయ మాన రక్షణ మమత్వమ్ము కలుగు నేల
ఛాయా పథమ్ములో తార భాంతి
ప్రకాశించు మధుర లీల,
నా కోమల నిరీహా శ్రమ శీల
మనమ్మున అభినయించు నేల
ఈ అగాధ మానసమ్ములో
నిరాధారనై తిరుగు చుంటి
స్వప్న సౌందర్యమ్ము నుండి జాగరణమ్ము కోరకుంటి
నారీ జీవిత చిత్ర మిదేనా
ఈ అస్త వ్యస్తములౌ రంగు లేమి
అస్ఫుట రేఖా సీమలో
కళా సౌందర్యమ్ము కల్పించినావు

ఆగుదు కాని ఆలోచించుటకు కాదు
అను దినమ్ము అస్పష్టమ్ముగా
అధికారమ్ము సాధింప యత్నింతు కాని ఆధీన నగుదు
నర తరువును భుజ లతల బంధించి
ఊగి పోయెద నేను ఓడి పోయెద
ఈ సమర్పణమ్ములో త్యాగమే కాని
స్వార్థ మిసుమంత లేదు
ఇచ్చుటే కాని పుచ్చుకొను టెరుగను—"

లజ్జ : ఏమనుచుంటివి ఆగుమో నారీ
అశ్రు జలమ్ముతో సంకల్పముతో
ముందే సమర్పించితివా జీవిత మధుర స్వప్నాల
నారీ ! నీవు శ్రద్ధా రూపిణివి
కైలాస గిరి కందరాల పీయూష స్రోతములా
జీవిత రంగంలో ప్రవహించు—
దేవతలకు విజయం
దానవులకు పరాజయం- యుద్ధం-
నిత్య జీవితంలో హృదయాంతరాన
విరుద్ధ భావాల సంఘర్షణ తథ్యం
కనుల నీరు కారు చున్నను మనస్సమర్పణ చేయవలయు
మందస్మిత వదనంతో సంధి పత్రం వ్రాయ వలయు

—(:)—

# మేధ

మనువుకు పూర్వ వైభవం గుర్తుకు వచ్చింది, యజ్ఞం చెయ్యాలనే కోరిక కలిగింది అందుకు ప్రళయంలో చావకుండా మిగిలిన యిద్దరు పురోహితులు తోడ్పడ్డారు. యజ్ఞం జరిగింది. శ్రద్ధ పెంపుడు జంతువు బలి ఈయబడింది. మనువు ఆశించి నట్లు శ్రద్ధ యజ్ఞంలో పాల్గొనలేదు. మనువు ఆశలు నిరాశ లైనాయి. సోమ పానం చేస్తూ శ్రద్ధ దగ్గరకు వెళ్లాడు. మోహాంతో నిద్రిస్తున్న ఆమె చేతిని తన చేతిలోకి తీసు కున్నాడు. ఆమె మేల్కొన్నది.

మనువు : "ప్రేమించిన రూపసి ప్రతికూలించినది

నా మనశ్చిత్రాలు స్వప్నమ్ములాయెను

ఈ అనంత మధు వనమ్ములో దారుణ జ్వాల రేగినది

ఎటు లార్ప వలయు ఎవరు చెప్ప గలరు.

కనుల ఎరుపు క్రమ్ముచుండె, ఉదాసీనత నిండిపోయె—

అంతరాంతర దాహమ్ము పెరుగుచుండె

యుగయుగాల అసఫలత్వం ఘనీభవించె

ఈ బాధ భయంకరమ్ము

ఈ అంతర్దాహము సర్వవ్యాప్తము

ఈ విషమయాసమానత్వము జగతీ తలాక్రందనమ్ము

మానవాంతరంగమ్ము అతి దారుణము నిర్మమమ్ము

ఈ జీవన నిష్ఠుర దంశనమ్ము

తద్భవ వ్యథా పీడనములు

కలుష చక్రములులా కనుల ముంగిట క్రీడించు

మానసాసావధానమ్మె పొరపాటు
అది దుఃఖ సరితలకు మూల మగును
ఆ అపరాధమ్ము దుర్బల చిహ్నమ్ము
సుఖవర్జితము తమస్సంచితమ్ము
నిత్యవినాశ శీల జగతి, ప్రగతి శీల మైత మది—
పూర్ణత్వము సాధింప పొరపాట్లు చేతు రేమొ
బ్రతికి మరణించుట తిరిగి యౌవనము పొందనేమొ.
ఈ గతిశీల బ్రహ్మాండము స్థిరము కాదా
క్షణిక వినాశాల చిరమంగళమ్ముండెనా —
ఈ విరాగమ్ము మానవత్వమా ?
ప్రాణి పట్ల ప్రాణికి నిర్మమత్వమా ?
ఒకరి విషాదమ్ము మరొకరి సంతోషమా
ప్రతి విశ్రామమ్ము ప్రగతి మార్గమా —
పశుల దుర్వ్యవహారమ్ము మరతు రెవరు
విషము నమృతము చేయు మార్గ మేది.
ఓ మానిసీ ! ఇది నీకు తగునా !
నా స్వర్గమ్ము పాడు చేయకు
అతీత నూత్న గీతికల వినిపించు
ఈ రమణీయ జగము భోగ్యమ్ము
జీవిత నది వాసనా ధార స్రవించు
శ్రమ మయమ్ము అభావ కలితమ్మగు
ఈ జగతీ వ్యాకులత, భయంకర చేతనత్వమ్ము

ఎన్నడు మరతువో నాడెస్వర్గమ్ము
రమ్ము ప్రేయసీ ఇదె సోమమ్ము.

శ్రద్ధ : విశ్వసింపను నిన్ను
క్షణికములు నీ భావములు
దేవుని పేరిట ఈ జీవబలి
స్వార్థము పేర మోసమ్ము
ఇదేనా నీ ఉజ్జ్వల నవమానవత్వము
శవ సముద్రమ్ము హంతకుడా !

మనువు : " స్వసుఖాభిలాష తుచ్ఛమ్ముకాదు
రెండు దినాల ఈ జీవిత చరమ లక్ష్యమదే –
ఇంద్రియాభిలాషా పూర్తి
స్వర్గమ్ముకాక మరేమి –
ఈ గిరి కందరాల నేనేమి వెదకు చుంటినో
అదే ఈ చంచల జీవిత స్వర్గ ధామమ్ము
సర్వకృతుల లక్ష్యమ్ము మనము
ముందు మన కామనలు తీరవలయు–"

శ్రద్ధ : ' ఇందుకేనా సృష్టి నిను బ్రతికించినది !
నీ నిర్మమత్వ భేద బుద్ధికి సంతసించినదా ?–
స్వార్థమ్ము వ్యక్తి వికాస శత్రువు
ఈ భీషణ స్వార్థము వినాశ హేతువు
ఇతరుల నవ్వించుము నవ్వుము సుఖ మందుము
ప్రపంచ సేవయే వికాస మయమ్ము

స్వసుఖార్థ మన్యుల బాధింతువా-
స్వ సుఖము నిన్ను సంతోషపెట్టు
కాని మానవత్వము మరణించును —"

మనువు : శ్రద్ధా ! సోమ రస పానము చేయుము
బుద్ధి బంధములు తెగును
నీవు నుడివినది నిజమ్మే
అట్లే చేయుము నికమీదట— "

స్త్రీ సహజంగా శ్రద్ధ హృదయం ద్రవించింది. శ్రద్ధ సోమపానం చేసింది. ఆ కైపులో ఆమె సిగ్గును మరచింది. మనువు శ్రద్ధల ఆ మధుర మిశ్రణం అపూర్వము ఆనందదాయకం అయినది. క్షణికమైన దుర్బలత్వం వల్ల శ్రద్ధ శాశ్వతంగా మనువుకు లొంగి పోయింది. రోజులు గడచినాయి. మనువుకు శ్రద్ధలో వెనుకటి మాధుర్యం, స్ఫూర్తి, ఉల్లాసం, ఆనందం, అభిరుచి, కనిపించడం లేదు. ఒక రోజు వేటనుండి వచ్చి శ్రద్ధను సమీపిస్తాడు.

మనువు: "శ్రద్ధా! లోటు లేకున్నది నీకు
కాని ఏదో లేమి వెన్నాడు చున్నది నన్ను
మరచిన ఏదో మధుర వస్తువు
వికల గాన మొనర్చు చున్నది
చిర ముక్త పురుషుడు పరతంత్రుడు కాలేడు
మోహ పాశాల బంధింప తలచిన
వ్యాకులత పెరుగు బంధములు తెంచు
నను మరపించగల అనురాగ మేదీ యిప్పుడు

సహజ సుఖముల నేల విడువ వలయు
జీవిత యుద్ధాన నేల ఓడ వలయు-
ఈ క్షణిక జీవితము భోగ్యము
స్వర్గీయ సుఖాల ప్రళయ నృత్యము చూడ లేదా
మరి యింత విశ్వాస మేల ఈ జీవితమ్ముపై
ఈ అశాంత వినాశ మయ జగత్తులో
ఇంత శాంత కళ్యాణ కామన యెట్లు కలిగె-
నా జీవిత పర దానమ్ము నీ ప్రేమ
దాని నాపైననె కొనసాగించుము
ఎందుకు నీకీ శ్రమ దేవీ !
శ్రమ భారమ్ము నాపై వదలుము
నూలు వడకెద వేల జంతు చర్మము చాలదా
నీ శ్రమ కష్టముల రహస్య మేమి-"

శ్రద్ధ: "నీవు దూర దేశమ్ము పోయిన
నూలు వడకు కొందును నేను
వాసనామయ దృక్కుల నుండి రక్షించు కొందు
శరీర సౌందర్యమ్ము పెంపొందించుదు—
నవాగంతకుని పశువులా మన నివ్వను
నవ జాత శిశువుకు సమస్తం సమకూర్తును—
అభావ మెరుగడు వాడు
ఈ నా లఘు విశ్వం శూన్యమ్ము కాదెపుడు

ఊయెల నూగించెద ప్రేమించెద
కౌగలింతును ముద్దిడు కొందును.
వాని అధర మధు స్మితులకు సంతసింతు
బాధాహరమ్మగు మాటల విందు—
వియోగాశ్రువులు అమృత బిందువులగు
ఆ నిర్వికారనయనాల, నా
ముగ్ధ చిత్రమ్ము కాంచి నంత—"

మనువు: "భవిష్య దానంద మూహించు చున్నావె
వెదకు చుంటి దానికై నేను—
మమత్వము కావలయు, జ్వలనము కాదు
ఏకాకినై నీ ప్రేమ చూరకొనవలె
నీ ప్రేమలో సగ భాగమ్ము వలదు నాకు
భిక్షుకుడనా నేను యాచింప
యాచనా ఫలార్థిని కాను నేను.
సుఖ మందుము నీవు నిత్యము
విచార హృదయుడనై పోయెద నెటకో
మనః పరవశత్వమె మహా దుఃఖం
ఇదె మహా మంత్రం, జపించెద నిత్యం—
నా ప్రేమ సంవేదనానుభూతుల నిట వదలి యేగెద
నీ కామనా పుష్పములు ఫలించుగాక
నా కష్ట పరంపర నైదుపొ్గనుచు
పోయెద నేను ఏకైక సుఖార్థినై—"

ఈర్ష్యా కలిత హృదయంతో మనువు శ్రద్ధను వదలి అనేక చోట్ల తిరుగు తాడు. కాని ఎక్కడా శాంతి లభించదు. చివరికి భూకంపం వల్ల నష్టభ్రష్టమైపోయిన సారస్వత దేశానికి వెళ్తాడు.

మనువు: "గహన గుహాంతరాల క్షుబ్ధ ప్రవాహంలా
ఈ జీవన విక్షుబ్ధ సమీరం పయనించును
భయ భీతమై భయపెట్టును సకల ప్రాణుల
నిర్మాణం ప్రతి పద వినాశం కనిపించును
బాధల పంచును దీనత్వం కలిగించును.
సంఘర్షణ, విరక్తి, మమకారం, సహప్రాణులు
అస్తిత్వ చిరంతన ధనుర్విచలిత
జీవన బాణం దేనిని ఛేదించును?
పర్వతంలా నిశ్చేతన జడుడను కాబోను
అవరోధ రహితుడో మరుత్సముడను
గతిమయ జ్వాలన శీల సూర్యుడ నగుదును
వెదకు చుంటి వన గుహా కుంజ గిరుల నెందుకో
ఉన్మాదిని, నిర్దయుడ, మమతా ప్రేరితుడ
ఉదార హీనుడ, సంఘర్షణ ప్రియుడ
జీవిత లక్ష్యం తెలియ కుంటి, చెప్పాదు రెవరు-
భాగ్య హీనుడ నిరాశ రశ్మి వెలుగు నశించె.
జీవన నిశీథమ్ము సర్వము అంధకార మయము-
ఈ జీర్ణ విశీర్ణ నగరమ్ము కాంచిన
కరుణ ఉద్భవించు కాని ప్రేమ నశించు-

తుచ్ఛ శారీరక సుఖ ప్రియులసురులు,
గర్వాంధు లపూర్ణుఁ సురలు-
ఇరువురు విశ్వాసహీనులు అనుకరణయోగ్యులుకారు
మమత్వ మయాత్మ మోహం,
స్వాతంత్ర్య మయ విశృంఖలత్వం ఉన్నవి నాలో
కాని భయ భ్రాంతుడ, శ్రద్ధా విహీనుడ."

కామ: "మనూ! శ్రద్ధను విస్మరించితివి
ఆత్మ విశ్వాస మయిని నిరసించి నావు
వాసనా తృప్తి స్వర్గమని ఎంచి నావు
పురుషత్వ మైకంలో నారీ మూల్యం గ్రహించ లేదు-
అధికృత పరాధీన సంబంధం సమరస మని మరచి నావు
ఆమె సమర్పించినది హృదయం నీకు
ప్రణయ పూర్ణం, జీవిత గౌరవమా హృదయం
చేతనా పూర్ణం శాంత ప్రభా కలితమ్మది.
కాని నీవు వరించిన దామె సుందర జడ దేహం మాత్రం
సర్వం నాదేనను భావం సంకుచితం నాశ హేతువు
అనుభ వించుము నీ దుశ్చర్యకు ఫలితం.
నీ అభినవ మానవ ప్రజా సృష్టి సమస్తం
ద్వంద్వ భావాల మునిగి తేలు, భేద భావమ్ము పెరుగు
అనంత సమస్య లెదుర్కొను, కలహములు రేగు
అభిలషితవస్తువులు లభింపవు, అనిచ్ఛితదుఃఖము దొరకు
సర్వం లభ్యమైనా సంతృప్తి లభింపదు-

కోరికలు రేగు, అశ్రువులై అగు-
నిస్వార్థ మంగళ మయ ప్రేమ అగుపించదు
మనో హృదయాలకు వైరుధ్య మేర్పడు-
అహంభావ మోహ మయ మగు జ్ఞాన శూన్యమగు
అనుమానములు రేగు, చింతా విచారములు ప్రబలు
యుద్ధములు పెరుగు- మానవత్వము నశించు
శ్రద్ధ యీ సంసృతి సుఖ రహస్యం- త్యాగ శీల
దానిమరచి వర్తమానమ్మువదలిభవిష్యత్తునూహింతురు
జరా మరణాల చింత అశాంతుల చేయు
తద్విచారములో అమూల్య జీవిత లక్ష్యమ్ము మరతురు-
పరివర్తనము సహింపరు- ఫలమ్ము నెరుగరు
కల్యాణభూమి ఈలోకమను శ్రద్ధా రహస్యం తెలియరు
ఈ లోకం మిథ్యయందురు-పరలోకం తథ్యమందురు
ఆశలలో నిరాశ నిర్మించు కొందురు
విశ్రాంతి లభింపదు-ఇది నాశాపం !"

మనువు భయకంపితుడౌతాడు. తనజాతిని రక్షించటానికి ఉపాయం ఆలోచిస్తుంటాడు ఇంతలో సారస్వత దేశపురాణి మేధ అక్కడకు వస్తుంది పరిచయానంతరం తన వేదననుఆమెకు తెల్పుతాడు.

మనువు : "బాధాకులిత మానసుడ విశ్వాపాంథుడ !
ఎరిగించుమమ్ము జీవిత మూల్యం, భవిష్యద్రహస్యం-
ఈ సృష్టి వినాశమయమా ! విశ్వాసం లేనే లేదా ?
ఈ మహాసృష్టిని ఉద్ధరింతు రెవరు ?"

మేధ : అందుకు సమర్థుడవు నీవే స్వాగతం మహా !
బుద్ధి నుపయోగించుము నమ్ముము–
అదే నిన్నుద్ధరించు, జగత్తును పాలించు
ఈ భోగ మయ జగత్తును నడిపించగ నడుం కట్టు
అధికారం వహించి నీ శక్తిని పెంచు –
విజ్ఞానం సర్వం నీ సొత్తు – ప్రకృతి నీ వశీభూతం !
నను మన్నించి అనుగమించి యశస్సు నందుము
ఇకమీాదట యీా దేశానికి అధికారివి నీవు –
ఈ నా సారస్వత దేశం సర్వం
భూకంపంలో సర్వ నాశనమైనది
పునరుద్ధారకులకై వెదకుచుంటి నేను
ఆశ ఫలించినది, అనుసరించుము నన్ను, ఆహ్వానమిదే!–

మనువు : నా జీవితాంధకారంలో
వెలుగు కిరణంలా చొచ్చినావు
నీ దర్శన భాగ్యంతో
నా సుప్త భావాలు మేల్కాంచినవి
ఉత్సాహ మయ ప్రసన్నత ఏర్పడినది–
పరావలంబనం వదలి బుద్ధిని అనుసరింతునిక
నా జీవిత సర్వం నికమీాదట
కర్తవ్య పూర్తికై వినియోగింతును
దివ్య సుఖ ద్వారం తెరతును—"

# జ్ఞానం

మనువు మేధ సహాయంతో సారస్వత దేశాన్ని పునరుద్ధరిస్తాడు. సర్వ సలక్షణ సంపన్నంగా చేస్తాడు మనువు ఉన్నతికి మేధ కారణమైంది. కాని మనువు ఏదో లోపాన్ని అనుభవిస్తూనే ఉన్నాడు. చివరికి మనువు మేధను కామిస్తాడు. ఆమె తిరస్కరిస్తుంది. ఈ విషయం తెలియగానే ప్రజలు ఉద్రిక్తులౌతారు. మనువు జరిగిన దానిని గురించి చర్చిస్తాడు మేధతో.

మనువు : " అస్వతంత్రుడనా నేను అధికార మిసుమంత లేదా
ప్రియ సతి శ్రద్ధకు సైతం లొంగ లేదే
మేధా పద చిహ్నాల నడువ వలెనా ?
నియమ బద్ధమా జీవితం
నియామకుడను నేను సైతం నియమ బద్ధుడనా ?
చిరబంధనహీనుడను, మృత్యువును సైతం ధిక్కరింతును
నాశన శీల జగత్తులో
తృప్తిమయ సమయమే చేతనా చిహ్నం

మేధ : " ప్రజాపతీ! అది అసంభవం అధికార దుర్వినియోగం
చేతనత్వం హృదయాల ద్వంద్వ భావ సంఘర్షణ రేపు
పూర్ణ వికాసమే జీవిత లక్ష్యం, ఇదే బుద్ధి సాధ్యం
ఆత్మ కళ్యాణమే స్వర్గీయ సుఖం
జన సుఖమే ఆత్మ కళ్యాణం-
సమయం గతి శీలం, చేతనామయం
అది ప్రళయంలో మహాచేతనాలయం "

మనువు : " నీ అనర్థ ప్రసంగం వ్యర్థం కామితార్థమ్ము వలయునాకు
అది లభింపకున్న ఏలనాకీ ప్రజాపతిత్వమ్ము
ఈ విశ్వంలో లీనం కమ్మందువు
అందు సుఖమేమున్నది దేవీ!
ప్రపంచం సర్వనాశన మైనా
లక్ష్యమొనర్చను నిను పొందిన రాణీ "

మేథ : " నా సుభాషితాలు వినవా నీవు
భవదీయ హితార్థమే నా ప్రయత్నం-
నీ శుభాకాంక్షిణిని, చెప్పదలచినది చెప్పితినిక నీయిష్టం
వాకిట ప్రజానీకం క్రోధంలో కదనానికి కాలుద్వుతోంది.

మనువు : " నిర్బలుడు కాడు నరుడు నేను
సమర రంగాన శక్తి చూపగలను
బాధాకర నియమాల బంధింపకు నన్ను
ఈ నిరాశామయ జీవితంలో క్షణికసుఖం కలిగించుము
శాసకుడ నేను, చిర స్వతంత్రుడ
నీపై సహితం అధికారం నాకున్నది "

మేథ : " నీ ఉన్నతి సోపానాల నవరోహించకు
హస్తగతాధికారమ్ముకై గర్వపడకు
ప్రకృతిని సాధించుట నేర్పితిని నీకు
ఈ సామ్రాజ్యాధిపతిని చేసితిని
అది అపరాధమా ప్రభూ ?
నీమాట వినకుండుట దోషమా ?"

మేథ ఎంతచెప్పినా వినకుండా మనువు ఆమెను బలాత్కరించ బోతాడు. ప్రజలు తిరగబడతారు. యుద్ధంలో అనేకమందిని చంపి చివరికి మనువు స్పృహ తప్పి పడిపోతాడు. ఇంతలో విరహ వేదనతో మనువుకోసం గాలిస్తూ తిరుగుతున్న శ్రద్ధ కుమారునితో అక్కడికి వచ్చి చేరుతుంది. గాయాలతోనున్న మనువుకు సపర్యలు చేస్తుంది. మనువు తెలివి పొందుతాడు.

మనువు : " శ్రద్ధా ! ఏ తెంచితివా ప్రియా !

ఈ భయంకర తమోరాశి నుండి

దూరప్రాంతానికి కొనిపొమ్ము నన్ను

ఎవరది మేథా ! పొమ్ముపొమ్ము-శ్రద్ధా ! చేయూతనిమ్ము

నిర్దయుడనై బాధించితి నిన్ను

క్షమియించుము, మధురధార కురిపించుము-

ఆపత్సమయంలో అరుదెంచితివి

అమృతధార తాగించితివి——"

శ్రద్ధ : నీవు నిర్దయుడవై విడచి వెడలిన వెంటనే

విరహవేదన వేరునాటినది, జీవితాశ నశించినది

మధురాభిలాషలు సన్నగిల్లినవి

విజయమే నీది, కాని అది నా ఓటమి కాబోదు

నా హృదయ సమర్పణమ్ము జీవితవంచన మ్మాయెను

నీకై పరితపించి నిద్రాహారములు మాని

గృహము వీడి వెడలితి వెదుక

ఇదె నీతనయుండు-పితృ ప్రతినిధి."

మనువు : " క్షమియించుము దేవి ! ఎరుగనైతి నీ హృదయం
క్రోధ మోహములు వెన్నంటినవి
దుఃఖసాగరమున ముంచినవి
నా జీవిత భాగస్థుడు యీ పుత్రుడు—
సుఖవంతులు కండి మీరిరువురు–"

మేధ : " ఏల నాపై యింత విరాగం తల్లీ–
నీ అనురాగాపేక్షితను నేను
పలుకరించుము నన్ను పతితను కాను
అపరాధను కాను తల్లీ !—
నీపతి ఉన్నతి పతనాలకు కారణం నేను కావచ్చునేమో
క్షమించగల నీ పరమక్షమ నాపై ప్రసరించుము తల్లీ!"

శ్రద్ధ : " విరక్తియేల నమ్మా, జీవితానురక్తివి–
స్త్రీమాయామమతా సంయుత–శక్తిమయి ఛాయాదేవి
పతిచేసిన వంచనానికి క్షమార్హను నేను మేధా !

మేధ : " అపరాధం ఎవరిదీ కాదు
అది అందరికీ సహజం
అధికారికి ఆటంకం శత్రుత్వం—
నియమ కర్తలే నిషేధకులు సైతం—
జనపద కళ్యాణ కారిణిని–నేడపనతి కారణమును
బుద్ధి శక్తి బలహీనమా
అన్యోపాసన తప్పునా నిత్యం–
భయభ్రాంతులు వదలవా, అశాంతిచ్ఛాయ వీడదా

శ్రద్ధ: " బుద్ధిమంతురాలవు కాని హృదయ శూన్యవు
పరస్పర సౌహార్దం నీ లక్ష్యం కానేకాదు
ఎవరికి వారే యమునాతీరే
నీ సిద్ధాంతం నాశహేతువు.
తర్క ప్రధానవు నీవు
నాస్తవికత శూన్యము నీలో
సత్య సుఖమును పొందలేదు
సుఖ ఛాయామాత్ర సంతుష్టవు
విశ్వాస శూన్యవు-వికాస మార్గమ్ము కాదది.
సుఖదుఃఖాల మధుర దివారాత్రుల
వదలి నావు-సరళమార్గమ్ము వీడి నావు-
చేతనత్వము త్రుంచినావు
విరాగము పంచి యిచ్చినావు
ఈ జగత్తు చేతనా స్వరూపం—
సంతత పరివర్తన శీలం
కణ విరహమిలనమయ నృత్యమయం
సంతతానంద ఉల్లాస పూర్ణం—
ఈ జగద్బాధను సహింప లేను
శక్తి కొలది త్యాగం చేతును.
ఇతడు మానవుడు మను పుత్రుడు
మీరితవుడు రాజ్యపాలన మొనర్చెడు
శాసకులై ప్రజల భయభ్రాంతులు తీర్చెడు

ఓ పితృ ప్రతినిధీ! ప్రియ సౌమ్య బాలకా-
ఇదే నీకు సుఖద ప్రాంతం
నీ కాంత కర్మ వినియోగం చేయుము
నీ మనోవ్యథా భారమ్ము
మేధా వాత్సల్య సమ్ముఖమున సన్నగిల్లు-
ఈమె తర్క-మయ-మరి నీవు శ్రద్ధామయుడవు
మనన శీలుడవు, మను పుత్రుడవు
మానవ భాగ్యోదయమ్ము చేయుము
సమభావ ప్రచార మొనర్చుము
సౌమ్య పుత్రుడా! శుభమగు గాక!
నీ సుయశోగీతి దిక్కుల మ్రోగు గాక!"

శ్రద్ధ పుత్రుడైన మానవుణ్ణి మేధకు సహాయంగా ఉంచి మనువు వెంట మానస సరోవరానికి వెళ్తుంది. విశ్రాంతి తీసుకుంటూ సృష్టి రహస్యాన్ని చెప్పమంటాడు మనువు. శ్రద్ధ ఆమానస సరోవర తీరంపైనే మనువుకు జ్ఞాన బోధచేస్తుంది

శ్రద్ధ: "తెలియ చెప్పెదనీకు ఇచ్ఛా కర్మజ్ఞాన లోకాలగూర్చి
ఈ త్రిలోకాల మధ్య స్థిత ప్రజ్ఞుడవు నీవు ప్రియా!
ఇది ఇచ్ఛాలోకం
శబ్దస్పర్శరసరూపగంధ వాహినులు ప్రవహించు నిచ్చట
యౌవనవసంతావస్థలో మేల్కాంచి సుషుప్తి నందునవి
మధురమధురభావములు రేగు రసమగ్నులగుదురందరు
అలింగన మధుర ప్రేరణ, లజ్జావన గుంఠనం సహజం

ఇది జీవిత మధ్యస్థం, భవ్యరసధారా సించితం
ఈలోకం మాయామయం మమకారాసక్త నిలయం
భావ చక్ర పరిభ్రమణం కలదిట
ఇచ్ఛాపాలన సత్యం నిత్యం
ఆసక్త భావనా వాసనలు హేతు
మోహా మాయా ఘాన మధ్యస్థులు
ఈ భావనా మయ లోకంలో
పాప పుణ్యాల పరాగం సాగు
నియమ బద్ధం యీ దేశం,
భావప్రకటనా స్వాతంత్ర్యం శూన్యం–
విషపీయూషాల కలయిక కలదిట–
అది కర్మ లోకం
కర్మ మయం ఆ లోకం, నియతి ప్రేరితం
ఏదో వ్యాకులేచ్ఛ కలదట సైతం–
విశ్రామ శూన్యం, వ్యాకుల మయం
శ్రమ మయ కోలాహల బాధామయం
క్రియా తంత్ర బంధితం ప్రాణం–
మానసిక సుఖాని లవాలం కాని కర్మ దుఃఖం
సుఖదుఃఖ సమ్మిశ్రణం–
భావుకత లేదు..కర్మ నిత్యం
కళా ఘోర ప్రేరితులైన కర్మిష్ఠులు
కాని సంతోషం సంతృప్తి శూన్యం

తృష్ణా జనిత మమత్వ వాసన నడిపించును లోకమ్మును
సుఖార్థం పంచ భూతోపాసన జరుగును
సతత సంఘర్షణ ఫలం అశాంతి
ప్రబలాకాంక్షల ప్రతిఫలం దుఃఖం
రాజులదే రాజ్యం, దళితులకు చోటు లేదు
క్షణిక భోగాసక్తులు సత్యం
స్త్రీ కాముకులు, తదర్థం దుష్కర్మ ప్రేరితులు
జడ ప్రాణ మనాంతరంగం, చేతనత్వం శూన్యం
మూడవది జ్ఞానలోకం—
సుఖ దుఃఖ ప్రభావయుతం కాదు
బుద్ధి చక్ర పరిభ్రమణం కలదు-
నిర్మమ న్యాయం నిత్యం సత్యం
నిస్సంగులు నిరీహులు నిర్నిమిత్తులు, మోక్ష మోహులు
కర్మ ఫలం లభించును తృప్తి శూన్యం
అతి విభూతి దాహం — తృష్ణ — సంతృప్తి
తపో న్యాయ ఐశ్వర్య మిళితం
గ్రీష్మాతప కాంతి వెలుగొందునిట
నిర్లోభులు, మనః ప్రేరితులు
కర్మ నిరతులు, జీవిత రసతృషితులు
ఉత్తములు, పరమ విజ్ఞానులు
శాంత మూర్తులు, దోష భయస్థులు
అభిమాన ధనులు, దంభ స్వభావులు

జీవిత భోగార్థులు కారు
తృషా మృషా వంచితులు
ఇంద్రియ భోగాసక్తులు కారు
జీవిత లక్ష్యహీనులు
శాంతి ప్రియులు కాని అశాంతి వ్యాపకులు వీరు
మానవేచ్ఛల పరిగణింపరు
జీవిత లక్ష్యం సుఖమని యెంచరు
మరేదో అమేయ మని తలంతురు
శాంతులు కారు—పాప భయస్థులు
శాస్త్ర పారంగతులు, అనుగాములు
పరివర్తిన శీలురు కారు
ఎరిగితివా మూడు లోకాల సుఖ దుఃఖ సమ్మిశ్రిత
భిన్న స్వరూపాల వేరు వేరు లోకాలను
జ్ఞానం కష్ట సాధ్యం, కర్మ వివేక శూన్యం
హృదయేచ్ఛ తీరు నెటులు
ఇచ్ఛా కర్మ జ్ఞానాల భిన్నత్వం
మానవలోకాశాంతికి మూలం
వాని సామంజస్య మార్గం
శ్రద్ధా హృదయ విశ్వాసం
ఇదే మానవ జీవన రహస్యం-
ఇదే మహా జ్ఞానం.——

——(:)——



రచయిత

జననం : 10-5-1931

స్థలం : యలకుర్రు. కృష్ణాజిల్లా